# వర్షయోగములు

## -: చైత్రమాసము :-

అనావృష్టియోగా: వత్సరాది ప్ర. శు. 3 శని. ప. రోహిణ్యాంకుజః 2 వత్సరాది ప్ర. బ ౧3 మంగ. ప. కుజ గుర్వోరేకరాశి స్థితిః 3 బ ౮ శని. ప్ర. ఆర్ద్రాయాంకుజః సువృష్టియోగా: యావన్నాసం బుధ శుక్రౌ సమీపస్థౌ 2 శు 3 శని. ప్ర. బ ౮ శని. పర్యం. మృగశీర్షే కుజః 3 శు ౧3 మంగళే కుజ చలనం 4 బ ౧౧ మంగళే శుక్రోదయః సారాంశము:- శుక్లములో అపుడపుడు వర్షములు పడును. బహుళములో ఉత్తరార్ధము నుండి ఎండలు తీవ్రమగును.

## -: వైశాఖమాసము :-

వైశాఖ శు ౬ గురు (మే 11) కృత్తికకార్తె - సామాన్యావృష్టిః బ ౪ బుధ (మే 24) రోహిణి కార్తె కుత్ర చిత్సువృష్టిః అనావృష్టియోగా: బ ౧ ఆది. పర్యం. ఆర్ద్రాయాం కుజః, 2, బ ౪ బుధ. ప్ర. పురోగురుః (వహ్ని) సువృష్టియోగా: 1బ ౪ బుధ. పర్యం. బుధ శుక్రౌ సమీపస్థౌ 2 శు ౭ శుక్ర. ప్ర. బుధో వక్రీ బుజుశ్శుక్రః 3 బ ౪ బుధే గురు శుక్ర సమాగమః ౪ బ ౬ శుక్రే గుర్వస్తమయం: నాడీయోగా: మే 11 లగా 16కు 24ల 30కు. చాంద్రయోగా: మే 13. 14. 20ల 26కు 28. 29. 31 జూన్ 1 2 సారాంశము:- ఈ మాసమున అధిక గ్రహములకు చండవాయు నాడీవాయు నాడీ సంచారము వలన గాలి దుమారములు. వడగాడ్పు వర్షములు పడును. కొన్ని అగ్ని ప్రమాదములు కూడ సంభవించును. పూర్ణిమా ప్రాంతమున తొలకరి వానలు ప్రారంభమగును.

## -: జ్యేష్ఠమాసము :-

శు ౪ బుధ (జూన్ 7) (గురు) మృగశిర కార్తె సాధారణ వృష్టి. బ ౫ బుధ (జూన్ 21) (గురు) ఆర్ద్ర కార్తె కదాచిత్సువృష్టి. అనావృష్టియోగా: శు ౬ శుక్ర. ప. పురోగురుః (వహ్ని) 2 శు ౬ శుక్ర. ప్ర. శుక్రాగ్రేకుజః 3 శు ౧౦ బుధ. ప్ర. రవి శన్యోస్సమ సప్తకం 4 బ ౧౪ ఆది. ప్ర. పురశ్శుక్రరూప రవిమధ్యః 5 బ 3౦ సోమ. ప్ర. ఆశ్లేషాయాం కుజః సువృష్టియోగా: 1 శు ౫ సోమ. ప. బుధో వక్రీ బుజుశ్శుక్రః 2 శు ౪ మంగళే కుజ చలనం 3 శు ౬ శుక్ర. ప్ర. బ ౧౪ ఆది. పర్యం పురశ్శుక్రః 4 బ ౪ శుక్రే గురూదయం 5 బ ౧౪ ఆది. ప్ర. పురశ్శుక్రః 6 బ ౧౪ ఆది బుధ గురు సమాగమః నాడీయోగా: జూన్ 6 లగా 12కు 21ల 25కు జూలై 3 చాంద్రయోగా: జూన్ 5. 6-9. లగా 23కు జూలై 2-3 సారాంశము:- అనావృష్టి యోగములు సువృష్టి యోగములు సమ బలము కలవిగ నున్నవి. నాడీ సంచారము కూడ సమ బలము కలదగుట వలన అపుడపుడు మంచి వర్షములు పడవచ్చును.

## -: ఆషాఢమాసము :-

శుద్ధ ౫ బుధ (జూలై 5) పునర్వసు కార్తె. సువృష్టి రివ. 1 బ ౧ బుధ (జూలై 19) పుష్యకార్తె - సువృష్టిః అనావృష్టియోగా: శు ౧౦ గురు. ప. శుక్రాగ్రే కుజః 2 శు ౧3 ఆది రవి శన్యోస్సమ సప్తకం 3 శు ౧౦ గురు .పర్యం. పురశ్శుక్రరూప రవి మధ్యః 4 బ ౬ సోమ .ప. ఆశ్లేషాయాంకుజః 5 శు ౧౦ గురు .ప్ర. శు ౧౫ మంగ.ప. పురోంగారకః 6 శు ౧౫ మంగ .ప్ర. బుధాగ్రే కుజః 7 శు ౧౫ మంగ .ప్ర. పురో బుధః 8 శు ౧౫ మంగ .ప్ర. పశ్చిమ మఘాది పంచకే శుక్రః 9 బ ౬ సోమ .ప్ర. సింహాంగారకః 10 బ ౧౪ సోమ .ప్ర. ఆర్ద్రాది పంచకే బుధ దర్శనం. సువృష్టియోగా: శు ౧౦ గురు ప. పురశ్శుక్రః 2 శు ౬ సోమ .ప్ర. సింహస్థ కుజస్య శుభ సంబంధః శు ౧౫ భౌమే కుజ చలనం. నాడీయోగా: జూలై 4 లగా 9 వర్కు జూలై 19 లగా 22కు అగ 1 చాంద్రయోగా: జూలై 6-7-19-20- 23-24-29-30-31. సారాంశము:- అనావృష్టి యోగము లధికముగనున్నను కార్తె ఫలములు సువృష్టి వచ్చుట వలన అత్యధిక గ్రహములకు శుభనాడీ సంచారము వలన ఈ మాసమున సమాన వర్షములుపడి గోదావర్యాది నదులు ప్రవహించును. కొన్ని ప్రదేశములు అనావృష్టిగ నుండునని పించు చున్నది.

## -: శ్రావణమాసము :-

శుద్ధ ౧ బుధ (అగ2) ఆశ్లేష కార్తె కుత్ర చిత్సువృష్టి. శు ౧౪ బుధ (అగ 16) మఘకార్తె - సువృష్టి. బ ౧౪ బుధ (అగ 30) పుబ్బకార్తె. సువృష్టి రివ. 1 అనావృష్టియోగా: శు ౫ ఆది .పర్యం. పురోబుధః 2 యావన్నాసం పశ్చిమ మఘాది పంచకే శుక్రః 3 యావన్నాసం సింహాంగారకః 4 శు ౫ ఆది .ప. బుధాగ్రే కుజః ౫ శు ౭ బుధ .ప. ఆర్ద్రాది పంచకే బుధ దర్శనం 6 శు ౫ ఆది .ప్ర. పుర్వాంగారకః సువృష్టియోగా: 1 శు ౧౦ శని .పర్యం. సింహస్థ కుజస్య శుభ సంబంధః 2 శు ౫ ఆది .ప్ర. బుధ శుక్రౌ సమీపస్థౌ. నాడీయోగా: అగ 2 లగా 5కు, 15ల 19కు, 27ల 31కు. చాంద్రయోగా: అగ 3-4-15ల 23కు 26-27-31. సారాంశము:- వర్షయోగములు తక్కువ. మాసమంతయు అన్ని గ్రహములకు శుభనాడీ సంచారము. సస్యానుకూల వర్షములు పడును. గోదావర్యాది నదులు బాగుగా ప్రవహించును అయినను కొన్ని ప్రాంతములకు వర్షలేమి కలుగును.

## -: భాద్రపదమాసము :-

శుద్ధ ౧3 బుధ (సెప్టెం 13) ఉత్తర కార్తె - సువృష్టి. బ ౧౨ మంగ (సెప్టెం 26) హస్త కార్తె సువృష్టి. అనావృష్టియోగా: 1 శు ౯ శని .ప. సింహాంగారకః 2 శు ౧౨ మంగ .ప. పశ్చిమ మఘాది పంచకే శుక్రః 3 బ ౧౦ ఆది .ప. పురోంగారకః 4 శు ౯ శని .ప్ర. బ ౧౧ సోమ .ప. ఉత్తర ఫల్గున్యాంకుజః 5 బ ౧౦ ఆది .ప్ర. బ 3౦ శుక్ర .ప. పురో బుధః 6 బ ౧౦ ఆది .ప్ర. బుధాగ్రే కుజః సువృష్టియోగా: 1 బ ౧౨ మంగ .ప. బుధ శుక్రౌ సమీపస్థౌ ౨ శు ౯ శనౌ కుజ చలనం 3 శు ౧౧ సోమ .ప్ర. బుధో వక్రీ బుజుశ్శుక్రః 4 శు ౧౨ మంగ. ప్ర. పశ్చిమేస్వాతీత్రయే శుక్రః 5 బ 3౦ శుక్ర .ప్ర. పతంగమార్గే కుజః 6 బ 3౦ శుక్ర. ప్ర. పురశ్శుక్రః నాడీయోగా: సెప్టెం బ 1-2-12ల 15కు 24ల 29కు. చాంద్రయోగా: సెప్టెం 1-9-10-12-13-16ల 23కు 26ల 28కు. సారాంశము:- వృష్ట్యనావృష్టి యోగములు సమ బలము కలవిగనున్నను శుక్రేతర గ్రహములకు శుభనాడీ సంచారము వలన మాసమంతయు మంచి వర్షములు పడును. ఆయా ప్రాంతముల సముద్రమున ఈదురు గాలులు వీచును.

## -: ఆశ్వయుజమాసము :-

శుద్ధ ౧౦ మంగ (అక్టో 10) చిత్రకార్తె - చిత్ర వృష్టి 1 బ ౯ సోమ (అక్టో 23) (మంగ) స్వాతికార్తె. వాతాల్పవృష్టి. అనావృష్టియోగా: 1 బ ౧3 శుక్ర .ప. బుధాగ్రేకుజః 2 బ ౧ ఆది. ప్ర. శుక్రాగ్రేశనిః 3 బ ౧3 శుక్ర .ప్ర. పురశ్శుక్ర రూపరవి మధ్యః 4 బ 3౦ ఆది .ప్ర. గురు శుక్ర సమసప్తకం. సువృష్టియోగా: 1 శు 3 మంగ .ప. బుధో వక్రీ బుజుశ్శుక్రః 2 బ 3 మంగ .ప. పశ్చిమేస్వాతీత్రయే శుక్రః 3 బ ౧3 శుక్ర .పర్యం. పతంగమార్గే కుజః 4

బ ౧౩ శుక్ర.ప. పురశ్చుక్రః 5 బ ౧ ఆది. ప్ర. చిత్రాయాం కుజః 6 బ ౧౧ బుధే కుజ చలనం 7 బ ౧౩ శుక్ర.ప. పురశ్చుక్రః నాడీయోగాః అక్టో 8ల 13కు 20ల 26కు. చాంద్రయోగాః అక్టో 9-10-13ల 21 కు 24-25 సారాంశము:- మాసమంతయు యథోచితముగ వర్షములు పడును. పూర్ణిమా ప్రాంతమున గాని అమా ప్రాంతమున గాని వాయుగుండములు కలుగవచ్చును.

## -: కార్తీకమాసము :-

శుద్ధ ౭ సోమ (నవం 6) విశాఖ కార్తీ - ప్రవాతావృష్టి 1 బ ౭ ఆది (నవం 19) అనూరాధ కార్తీ - వాతాల్పవృష్టి. అనావృష్టియోగాః 1 బహు 3 బుధ.ప. శుక్రాగే శనిః 2 శు ౧౨ శుక్ర ప. పురశ్చుక్రరూప రవిమధ్యః 3 యావన్యాసం గురు శుక్ర సమసప్తకం 4 శు ౫ శని.ప్ర. బ ౧౨ శుక్ర.ప. స్వాత్యాంకుజ సంచారః 5 శు ౧౨ శుక్ర ప్ర. పురోబుధః సువృష్టియోగాః 1 శు ౫ శని.ప. చిత్రాయాం కుజ సంచారః 2 శు ౧౨ శుక్ర ప. పురశ్చుక్రః 3 శు ౧౨ శుక్ర.ప్ర. బ ౫ శుక్ర.ప. బుధ శుక్రౌ సమీపస్థౌ 4 శు ౧౨ శుక్ర ప్ర. పతంగమార్గే కుజః 5 బ ౧౨ శుక్ర ప్ర. విశాఖాయాంకుజః నాడీయోగాః నవం 5ల 9కు 17ల 22కు చాంద్రయోగాః నవం 7-8-12-13-15ల 21కు సారాంశము:- అధిక గ్రహములకు చంత వాయునాడి. వాయునాడి సంచారముల వలన గాలి వాన సూచనలు గలవు. బహుళములో శీతల మారంభమగును.

## -: మార్గశిరమాసము :-

అనావృష్టియోగాః 1 శు 3 శుక్ర.ప. గురు శుక్ర సమసప్తకం 2 బ ౫ ఆది పర్వం. గురు శుక్ర సమసప్తకం 3 బ ౫ ఆది.ప. పురోబుధః 4 బహు 3 శుక్ర ప్ర. రవిగుర్వోస్సమసప్తకం. సువృష్టియోగాః 1 యావన్యాసం పతంగమార్గే కుజః 2 బ ౧ ప విశాఖాయాం కుజః 3 శు ౧౧ శనౌ కుజ చలనం 4 బ ౫ ఆది ప్ర బుధ శుక్రౌ సమీపస్థౌ 5 బ ౯ గురౌ శన్యస్తం సారాంశము:- స్వల్పమైన గాలితో అపుడపుడు వర్షములు ఋతుపర్వమనుకూలముగ నుండును

## -: పౌషమాసము :-

అనావృష్టియోగాః 1 బ 3 ఆది.ప. రవి గుర్వోస్సమసప్తకం 2 శు ౨ శని ప బ ౯ శని.ప గ్రహత్రయవక్రం 3 శు ౫ మంగ.ప్ర. బ ౯ శని.ప. జ్యేష్ఠాయాం కుజ సంచారః 4 శు ౧౧ ఆది.ప్ర. శు ౧౩ మంగ.పర్వం. పురోబుధః 5 శు ౧౩ మంగ ప్ర. బ ౮ శుక్ర.ప. పురశ్చుక్రరూప రవి మధ్యః 6 శు ౧౩ మంగ. ప్ర. కుజశనౌర్మధ్యే బుధః. సువృష్టియోగాః 1 శు ౧౧ ఆది ప. పతంగ మార్గే కుజః 2 శు ౧౧ ఆది ప. బుధ శుక్రౌ సమీపస్థౌ 3 శు ౧౩ మంగ.ప్ర. బ ౮ శుక్ర.ప. పురశ్చుక్రః 4 బ ౪ సోమే శుక్రాస్తం 5 బ ౮ శుక్ర.ప్ర. సర్వేగ్రహాస్సూర్యపృష్ఠావలంబినః 6 బ ౯ శనౌ కుజచలనం 7 బ ౯ శని.ప్ర. శుక్రో వక్రీ ఋజుర్బుధః 8 బ ౧౦ భానౌ శుక్రోదయం 9 బ ౧౨ భౌమే శన్యుదయం. సారాంశము:- మాసమధ్య తెరపిగ నుండి ఆద్యంతముల యందు వర్షములు పడును

## -: మాఘమాసము :-

అనావృష్టియోగాః 1 శు ౧౨ మంగ.పర్వం. కుజశనౌర్మధ్యే బుధః 2 శు ౧ శని ప ౦ ౧౦ మంగ.పర్వం. గురు శుక్ర సమసప్తకం 3 శు ౯ సోమే అనూరాధాదినవకే బుధ శుక్ర సమాగమః 4 శు ౧౦ సోమ.పక్షం. శుక్రాగే శనిః సువృష్టియోగాః యావన్యాసం సర్వేగ్రహాస్సూర్యపృష్ఠావలంబినః 2 శు ౬ గురు.ప శుక్రో వక్రీ ఋజుర్బుధః 3 శు ౯ సోమే బుధ శుక్ర సమాగమః సారాంశము:- పూర్ణిమ ప్రాంతము వరకు సామాన్య వర్షములు పడును.

## -: ఫాల్గునమాసము :-

అనావృష్టియోగాః 1 ఆ పత్రం శుక్రాగే శనిః 2 శు ౧ సోమ ప బ ౫ శుక్ర పర్వం ఉత్తరాషాఢాయాంకుజ సంచారః 3 శు ౫ గురౌ కుజ శని సమాగమః బ ౮ మంగ ప్ర ఆ పత్రం పురోబుధ రూప రవి మధ్యః సువృష్టియోగాః బ ౮ మంగ ప సర్వేగ్రహాస్సూర్యపృష్ఠావలంబినః 2 శు ౭ శనౌ కుజ చలనం 3 బ ౮ భౌమే శని చలనం సారాంశము:- ఈ మాసమున 1-2 మంచి వానలు పడి అమావాస్య ముందు తెరపిగ నుండును.

వర్ష సారాంశము - వైశాఖమున అనావృష్టి యోగము తక్కువ ఆషాఢ శ్రావణముల యందు అనావృష్టి యోగములు ఎక్కువ పౌషమున వర్ష యోగములెక్కువ కావున ఆషాఢ శ్రావణములందు కొన్ని ప్రాంతములందు వర్షములు తక్కువగనుండును. వైశాఖమున తొలకరి వానలు ప్రారంభమగును. జలరాశియందు, జల నక్షత్రము నందు, జల నవాంశమునందు జల లగ్నమునందు చంద్రుడుండగా రాత్రివేళ ఆర్ద్రకార్తె అగుట వలనను. కార్తె ప్రవేశములు ఎక్కువగా శుభవారముల యందు అగుట వలనను సమృద్ధమగు వర్షములు పడి సుభిక్షముగ నుండును.

## -: చైత్ర మాసము :- ధరలు

ధాన్యము నిలబాటు. బెల్లం పంచదార చురుకు బంగారము మందము. పట్టు నిలబాటు. ఉన్ని చురుకు. నూలు నిలబాటు. మిర్చి- చింతపండు నిలబాటు. నువ్వులు చురుకు కొబ్బరి నిలబాటు. అపరాలు నిలబాటు. నిత్యావసర వస్తువులు చురుకు. దుంప సరుకులు చురుకు.

## -: వైశాఖమాసము :-

ధాన్యం, బెల్లం, పంచదార చురుకు బంగారము మందములో చురుకు. పట్టు నిలబాటు. ఉన్ని చురుకు. నూలు చురుకు. మిర్చి- నువ్వులు- కొబ్బరి చురుకు. చింతపండు- మందము అపరాలు దుంప సరుకులు చురుకు నిత్యావసర వస్తువులు నిలబాటు

## -: జ్యేష్ఠమాసము :-

ధాన్యం బెల్లం చురుకు. శర్కర మధ్యమ సమము. బంగారము పట్టు చురుకు నూలు మందము. ఉన్ని, నువ్వులు చురుకు కొబ్బరి. మిర్చి నిలబాటు చింతపండు, నిత్యావసర వస్తువులు నిలబాటు. అపరాలు చురుకు. దుంప సరుకులు మందము.

## -: ఆషాఢము :-

ధాన్యము. బెల్లము. శర్కర నిలబాటు. ఉన్ని. పట్టు చురుకు. నూలు చురుకు మిర్చి నిలబాటు. చింతపండు మందము నువ్వులు మంచి చురుకు. నిత్యావసర వస్తువులు చురుకు. అపరాలు, దుంప సరుకులు- బంగారము నిలబాటు.

## -: శ్రావణమాసము :-

ధాన్యము కొద్ది చురుకు. బెల్లం, శర్కర స్వల్ప మందము. చింతపండు మందము. మిర్చి చురుకు. ఉన్ని మందము. నూలు చురుకు. పట్టు నిలబాటు. బంగారము చురుకు. నువ్వులు నిలబాటు. కొబ్బరి చురుకులో నిలబాటు. దుంప సరుకులు చురుకు. అపరాలు మందం. నిత్యావసర వస్తువులు నిలబాటులో చురుకు.

## -: భాద్రపదమాసము :-

ధాన్యము చురుకు. బెల్లము, శర్కర నిలబాటు. చింతపండు- మిర్చి చురుకు. బంగారము చురుకులో మందము. ఉన్ని, పట్టు మందములో చురుకు. నూలు మందము. నూనె నిలబాటు. కొబ్బరి మందము. దుంప జాతులు నిలబాటు. అపరాలు చురుకు. నిత్యావసర వస్తువులు మందము.

## -: ఆశ్వయుజమాసము :-

ధాన్యము- నిలబాటు. బెల్లం, శర్కర చురుకు. చింతపండు మందము. మిర్చి. బంగారము నిలబాటు. పట్టు చురుకు. ఉన్ని నిలబాటు. నూలు మందము. నువ్వులు. దుంప సరుకులు చురుకు. కొబ్బరి దుర్లభము. అపరాలు చురుకు. నిత్యావసర వస్తువులు నిలబాటు.

## -: కార్తికమాసము :

ధాన్యం మందం. బెల్లం, శర్కర మందము. చింతపండు నిలబాటు. మిర్చి చురుకు. బంగారము నిలబాటు. ఉన్ని మందం. పట్టు చురుకు. నూలు నిలబాటు. నువ్వులు. దుంప సరుకులు దుర్లభము. కొబ్బరి రవాణా సాగును. అపరాలు చురుకు. నిత్యావసర వస్తువులు. నిలబాటు.

## -: మార్గశిరమాసము :-

ధాన్యం నిలబాటు. బెల్లము, శర్కర చురుకు. మిర్చి మందం. చింతపండు చురుకు. పట్టు మందము. ఉన్ని, బంగారము చురుకు. నూలు. నువ్వులు మందము. దుంప సరుకులు. కొబ్బరి చురుకు. అపరాలు నిలబాటు. నిత్యావసర వస్తువులు మందము.

## -: పౌషమాసము :-

ధాన్యము మందము. బెల్లం శర్కర నిలబాటు. చింతపండు, మిర్చి మందము. ఉన్ని. బంగారము మందము. పట్టు చురుకు. నూలు, నువ్వులు మందము. కొబ్బరి, దుంప సరుకులు చురుకు. అపరాలు చురుకు. నిత్యావసర వస్తువులు నిలబాటు.

## -: మాఘమాసము :-

ధాన్యం నిలబాటు. బెల్లము, శర్కర చురుకు. చింతపండు, మిర్చి మందము. బంగారము, పట్టు చురుకు. ఉన్ని మందము. నూలు, నువ్వులు నిలబాటు. దుంపసరుకులు చురుకు. కొబ్బరి చురుకు. అపరాలు మందము. నిత్యావసర వస్తువులు చురుకు. రస వస్తువులకు రవాణా సాగును.

## -: ఫాల్గుణమాసము :-

ధాన్యం మందము. బెల్లము, శర్కర చురుకు. మిర్చి. చింతపండు చురుకు. బంగారము, ఉన్ని నిలబాటు. నూలు చురుకు. పట్టు మందమే. నువ్వులు చురుకు. దుంప సరుకులు నిలబాటు. కొబ్బరి నిలబాటు. అపరాలు రవాణా సాగును. నిత్యావసర వస్తువులు నిలబాటు.

ధరలు విమర్శించవలసిన పద్ధతులు చాల కలవు. అందులో గ్రహయోగములను బట్టియే వ్రాసినాము. ఈ విషయములను వర్తకులు గుర్తింపవలయును. మిగతా పద్ధతులచే విమర్శించుట ఈ పంచాంగ రచనా కాలమందు ఎంత మాత్రము సాధ్యముకాదు.



### మేషము:- సౌరగోచారము- మేషములో పుట్టిన వారికి

### చాంద్రగోచారము (అశ్విని 4 పా, భరణి 4 పా, కృత్తిక 1వ పాదము)

### ఆదా 11, వ్యయ 5, రాజ 2, అవ 4

వత్సరాది ప్ర. జ్యేష్ఠ. బ ౧౪ ఆది 2-7-89కు ద్వితీయమున గురుడు లోహమూర్తి అర్థశుభుడు. తదాద్యావత్సరము తృతీయమున గురుడు తామ్రమూర్తి సామాన్యుడు. ఉగాది ల. ఫాల్గున బ ౮ మంగళ 20-3-90 వారంకు భాగ్యమున శని తామ్రమూర్తి సామాన్య పాపి. తదాద్యావత్సరము రాజ్యమున శని రజతమూర్తి శుభుడు వత్సరాది ప్ర. భాద్రపద బ ౯ శని 23-9-89 వారంకు రాహుకేతువులు 11-5 రాశులయందు సువర్ణమూర్తులు పూర్తి శుభులు. తదాద్యా వత్సరము 10-4 రాశుల యందు తామ్రమూర్తులు పాపులు- శ్రమకారులు. వేధగోచారముచే 2-7-89ల ఆ వత్సరం గురుడు పాపి. వత్సరమంత శని రాహుకేతువులు శుభులు ఇట్టు విచారణ చేయగా వీరికి గతములో నెరవేరని శుభకార్యములు జ్యేష్ఠాంతములోగా నెరవేర గలవు. ఆరోగ్యము బాగు. వ్యవసాయదారులకు కృష్యను కూలముగ ఫలించును. విద్యార్థులు మార్చి ఛాన్సులో ఉత్తీర్ణులుగాగలరు. ఉద్యోగులకుత్తేజముగా నుండును. చైత్ర శు. రాబడిన మించిన ఖర్చు. విషయాంతర మనస్సువలన జడత్వము. నియమ ప్రవృత్తిచే కీర్తి కలుగును. బహు సాహస కార్యములు నెరవేరును. కళత్ర సౌఖ్యము. తీర్థయాత్ర సన్మిత్ర లాభములు కలుగును. వైశా శు. శుభ కార్య సాఫల్యము. జయము. ఆరోగ్యముగా ఉన్నను మనస్సంకోచము తప్పదు. బహుళ జ్యేష్ఠ శు.ముల పూర్వము వలె నుండును. జ్యేష్ఠ బ శుభ కార్యాలోచనము. భయము శత్రువుల అలజడి మెండుగా ఉండును. ఆషాఢ శు. ఒడుదుడుకులు, ఖర్చు, మనో వైకల్యము హెచ్చుగా నుండును. బహు. ఆరోగ్యము సంగీతాను రాగము కలిగి యున్నను ప్రాతికూల్యము మెండు. శ్రావణ శు శత్రుపీడ, ధనమున కిక్కట్టు. సంసార సౌఖ్యము. కొన్ని చోట్ల జయము కలుగును. బహు భాద్రపదశుద్ధ ధనముచేతి కందుట అన్ని రంగముల ప్రీతికరముగ నుండుటవలన సంతోషము కలుగును. భాద్ర. బ. భయాందోళనములు ఉద్యోగములో మార్పులు రావచ్చును. మిత్ర సహకార ముండును. ఆశ్వయుజ శు. అలంకార ప్రాప్తి. శుభ కార్యాలోచన. మాట చెలాయింపు హెచ్చు. బహు ఆరోగ్య భంగము. వ్యాపార మాంద్యము. ధనమున కిక్కట్టు తప్పవు. కార్తిక శు. వ్యసనలోలత్వము. ఆరోగ్య భంగము. ఆందోళనము. సంసారమున చిలిపి పేచీలు కలుగును. బహు. అనుకూల పరిణామము. జయ సంతోషములు కలుగును. మార్గశిరమున అన్ని రంగములయందు వ్యతిరేకత. మనోవేదన. భయ సంకోచములు కలుగును. పౌషమున మిశ్రమముగ నుండును. వ్యయ ప్రయాసలు పలుకుబడి సామాన్యము. మాఘ శు. ధనలాభము. సంసార సౌఖ్యము. శుభ కార్య సంఘటన కల్గును. బ. అన్ని రంగముల యందు జయము. శుభ కార్య నిర్వహణ. శుభములు జరుగును. ఫాల్గునమున వ్యాపారాభివృద్ధి. ధన లాభము మాట చెలాయింపుతో సుఖాంతము. వీరికి

1-13-20-25 తారీఖులు- సోమ గురు వారములు శుభప్రదము. గురు శనులకు జప దానములు గావించిన మేలుగా నుండును.

అశ్వినివారలకు:- వత్సరమంత గురుడు పాపి. వత్సరాది ప్ర. 20-3-90కు శని పాపి. వత్సరమంత రాహుకేతువులు శుభులు.

భరణివారలకు:- వత్సరమంత గురుడు పాపి. వత్సరాది ప్ర. 23-9-89కు కేతువు పాపి. వత్సరమంత శని రాహువులు శుభులు.

## వృషభము:- సౌరగోచారము (వృషభ మాసములో పుట్టినవారికి)



చాంద్ర గోచారము (కృత్తిక 2-3-4 పా. రోహిణి 4 పా. మృగశిర 1-2 పా.)

### ఆదా 5. వ్యయ 14. రాజ 5. అవ 4

వత్సరాది ప్ర. జ్యేష్ఠ బ ౧౪లో అది 2-7-89 వారం కుజన్మమున గురుడు తామ్రమూర్తి పాపి శ్రమకారి. తదాద్యావత్సరము ద్వితీయ గురుడు రజతమూర్తి త్రిపాదాధిక శుభుడు. ఉగాది లగా పాల్గున బ ౭ మంగళ 20-3-90 వారంకు అష్టమ శని- సువర్ణమూర్తి- అర్ధ శుభుడు. తదాద్యావత్సరము భాగ్యశని లోహమూర్తి పాపిశ్రమకారి. ఉగాదిల. భాద్రపద బ ౯ శని 23-9-89 వారంకు రాహుకేతువులు 10-4 రాశులయందు రజతమూర్తులు సామాన్యులు. తదాద్యావత్సరము 9-3 రాశుల యందు రజతమూర్తులు శుభులు. వేధ గోచారముచే వత్సరమంత గురుడు పాపి. వత్సరమంత శని రాహుకేతువులు శుభులు. ఇట్లు పర్యవేక్షించగా ఆషాఢము వరకు అన్ని రంగముల వ్యయప్రయాస లధికము. తదాద్యావత్సరము క్రమేపియు అన్ని రంగముల కార్యసిద్ధియగును. శుభ కార్యములు కలిసివచ్చును వ్యాపార వ్యవసాయములు లాభసాటిగా నుండును. చైత్ర శు. అనారోగ్యము. మానసికాందోళన. స్వల్ప పేచీలు ఋణభారమధికమగును. బహు. వ్యాపార మందము. సంసార సౌఖ్యము పలుకుబడి తక్కువ. వైశాఖ శు. కొన్ని రాజకీయ ఇబ్బందులకు గురయి ధన వ్యయంతో హామీలతో బయటపడుదురు. బహు. ప్రయాణము లధికము. మనశ్శాంతి కొలది. ఆరోగ్య భంగము. జ్యేష్ఠ శు. పూర్వము వలె నుండును. బహు. సర్వత్ర ప్రతిబంధకములు తొలగును. మనశ్శాంతి చేకూరును. ఆరోగ్యము కలుగును. శుభములు కలిసి వచ్చును. ఆషాఢశు. ఉద్యోగమున ప్రమోషన్లు. మాట చెలాయింపు. ఆరోగ్యము కలుగును. బహు. సంగీత సాహిత్యములందభిరుచి. శరీర సౌఖ్యము. ధన రాబడి కల్గును శ్రావణ శు. సర్వ సౌఖ్యములతో గతము వలెనుండును. బహు. అధిక వ్యయము. కొన్ని కార్యములు మందగొడిగా నుండును. భాద్రపదము శ్రావణము వలెనున్నను. భయము- ధనలేమి- శత్రుపీడ- మానహాని మొ. అసత్ఫలితములు కలుగును. మధ్య మధ్య కొన్ని రంగములయందు తెరపి కల్గును. సామాన్యారోగ్యము. అశ్వయుజ శు. శుభాశుభ మిశ్రమముగా ఉండును. వ్యయ ప్రయాసలతో కొన్ని రంగములయందు కార్యసిద్ధి యగును. బ. ఆరోగ్యము తగ్గును. లావాదేవీలు తగ్గును. కొంత సుముఖత ఏర్పడును. కార్తిక శు. వ్యవహారముల యందు జయము. సంపూర్ణా రోగ్యము కలుగును. బహు. ఋణభారము శత్రుపీడ ఏర్పడును. మార్గశిరమున అనుకొనని ఖర్చులు.ఇబ్బందులు కలుగును. వ్యవహారముల యందు చిక్కులు కలుగును. పౌషమున కొంత తెరపి కలిగి సౌఖ్యముగను శుభకార్య ప్రయత్నములు నెరవేరును. మాఘమున ఆర్థికఇబ్బంది ఆరోగ్య భంగము

వ్యవహారముల వ్యతిరేకత కలుగును. ఫాల్గున శు. సామాన్యముగ నుండును. బహు. అష్టమ శని బాధ తొలగును. ఆదాయం కనబడును. ఆరోగ్యము కలుగును. వీరికి 2-14-21-26 తారీఖులు మంగళ శుక్రవారములు ప్రశస్తములయినవి. శని రాహుకేతువులకు జపదానములు- విష్ణు సహస్రనామము పారాయణము చేసిన శుభప్రదముగా ఉండును.

కృత్తికవారలకు: వత్సరాది ప్ర. 2-7-89కు గురుడు శుభుడు. వత్సరాది ప్ర. 27-1-90కు రాహువు శుభుడు. వత్సరమంత శనికేతువులు శుభులు.

రోహిణి వారలకు : 2-7-89ల. ఆ వత్సరం గురుడు శుభుడు. వత్సరమంత శని రాహు కేతువులు శుభులు

మృగశిర వారలకు : వత్సరమంత గురు కేతువులు పాపులు. వత్సరాది ప్ర. 11.2.90కు శని శుభుడు. వత్సరమంత రాహువు శుభుడు.



## మిధునము:- సౌరగోచారము (మిధున మాసములో పుట్టినవారికి)

చాంద్రగోచారము (మృగశిర 3-4 పా. ఆర్ద్ర 4 పా. పునర్వసు 1-2-3 పా)

### ఆదా8, వ్యయ 11,రాజ 1అవ 7

వత్సరాది ప్ర. జ్యేష్ఠ బ. ౧౪ ఆది 2-7-89 వారంకు వ్యయ గురుడు రజతమూర్తి. అర్ధాల్ప శుభుడు. తదాద్యావత్సరము జన్మ గురుడు సువర్ణమూర్తి. అర్ధ శుభుడు.. వత్సరాది ప్ర. ఫాల్గున బ ౯ మంగళ 20-3-90 వారంకు సప్తమ శని రజతమూర్తి సామాన్యుడు. తదాద్యావత్సరము అష్టమ శనితామ్రమూర్తి. పాపి. వత్సరాది ప్ర. భాద్రపద బ ౯ శని 13-9-89 వారంకు రాహుకేతువులు 9-3 రాశులందు లోహమూర్తులు సామాన్య పాపులు. తదాద్యావత్సరం 8-2 రాశులయందు సువర్ణ మూర్తులు అర్ధ శుభులు. వేధ గోచారముచే వత్సరమంత గురుడు పాపి. ఉగాది ప్ర. 20-5-89కు రాహువు పాపి. వత్సరమంతా శనికేతువులు శుభులు. ఆషాఢ మాసము వరకు కొన్ని ప్రతిబంధకములు కనిపించుచున్నవి. అక్టోబరు వర కు సామాన్యముగ ఉండి వత్సరాంతము లో పూగా శుభకార్యములు, కార్యసిద్ధి, ఆదాయాభివృద్ధి, రాజకీయములలో గెలుపు కలుగును. చైత్ర శు. రాబడి, సౌఖ్యము, కుటుంబమునకు కళ్యాణ ప్రయత్నములుకొనసాగును.బహుఆదాయవ్యయములు సమముగా ఉండును. వైశాఖ శు. రాబడికంటే ఖర్చెక్కువ. వ్యయ ప్రయాసలధికము. బహు. శుక్లమువలెనున్నను ఆరోగ్యము భంగము. మానసికాందోళనము హెచుచు. జ్యేష్ఠ శు. వ్యవహారపు చిక్కులు. మానహాని సామాన్యారోగ్యము. బహు. కొంతలో కొంత శాంతి భద్రతలు ఏర్పడును. ఆరోగ్యం కుదుటపడును. రాజదండన తగ్గును. ఆషాఢ శు. వ్యర్ధ ప్రయాణములు, కుటుంబ సౌఖ్యము తక్కువ. వ్యాపార వ్యవహారములు యందు మాంద్యము కలుగును. బహు. అన్ని రంగముల యందు మధ్య రకముగా ఉండును. ఉద్యోగులధికారులతో పేచీలు పడరాదు. శ్రావణ శు. శ్రమగ నుండును. కుటుంబ కలతలు రాజకీయముల వత్తిడి ఋణ బాధ హెచ్చగును. బహు. కొంత అనుకూల వాతావరణ యేర్పడును. అంతటి శ్రమలు తగ్గుముఖం పట్టును. భాద్రపద శు. అన్ని రంగముల యందు జయము కలుగును. ధనము చేతికందును. ఆరోగ్యము మేలు. బహు. శత్రువుల వత్తిడి హెచ్చు. సర్వత్ర ఆటంకములు పొడసూపును. వ్యవసాయ నష్ట సూచనలు కలవు. ఆశ్వయుజమున శుభకార్యములకు నాందిపడును. వ్యయ ప్రయాసలధికము. శ్రమకు తగిన ఫలము తక్కువ. కార్తీక శు. గృహస్థితి అనుకూలముగా లేదు. శ్రమ హెచ్చు. మనోవ్యాకులత, యత్నీకృత కార్యభంగము. బహు. వ్యాపారాభివృద్ధి, సంసార సౌఖ్యము, విద్యారంగమున అనుకూలముగా నుండును. మార్గశిర శు. శత్రుజయం. ఆరోగ్యం. ధనాభివృద్ధియున్నను భయముగ నుండును. బహు. అధికారులతో పేచీలు వ్యవసాయమున స్వల్ప లాభముగ

నుండును. పౌషము గతమువలె నుండును. మాఘశు. శుభాశుభ మిశ్రమముగ నుండును. ఆదాయ వ్యయములు సమముగా నుండును. బహు. శ్రమగ నుండును. పరీక్షలలో జాగ్రత్త అవసరము. ఫాల్గున శు. ధనలాభము యత్నీ కృత కార్య సాఫల్యము జరుగును. బహు. సంసారమున సౌఖ్యమల్పము. స్వల్పనారోగ్యము. మార్చి 20 నుండి అష్టమ శని ప్రారంభమగును. వీరికి 3-15-22-27 తారీఖులు- బుధ, శనివారములు ప్రశస్తమయినవి- ప్రతి గురువారమున గురునకు సెనగలు దానమిచ్చుట వలన శుభముగ నుండును. సుందరకాండ పారాయణం మంచిది.

ఆర్ద్రవారలకు . వత్సరమంతా గురుడు పాపి. వత్సరాది ప్ర. 11-2-90కు శని పాపి. వత్సరమంతా రాహు కేతువులు శుభులు.

పునర్వసువారలకు: వత్సరాది ప్ర. 2-7-89కు గురుడు శుభుడు. వత్సరమంత శని రాహుకేతువులు శుభులు..



## కర్కాటకము: సౌర గోచారము (కర్కాటకమాసములో పుట్టినవారికి)

చాంద్ర గోచారము (పునర్వసు 4వ పా: పుష్యమి4పా,ఆశ్లేష4పా)

### ఆదా 2, వ్యయ 11, రాజ 4, అవ 7)

వత్సరాది ప్ర. జ్యేష్ఠ బ ౧౪ ఆదివారము 2-7-89కు లాభ గురుడు సువర్ణమూర్తి. పూర్తి శుభుడు. తదాద్యావత్సరము వ్యయ గురుడు లోహమూర్తి పూర్తి పాపి. వత్సరాది ప్ర. ఫాల్గున బ ౮ మంగళ 20-3-90 వారంకు షష్ఠ శని లోహమూర్తి- అర్ధ శుభుడు. తదాద్యావత్సరము సప్తమ శని సువర్ణమూర్తి. అర్ధ శుభుడు. వత్సరాది ప్ర. భాద్రపద బ ౯ శని 23-9-89 వారంకు రాహువు కేతువులు 8-2 రాశులందు తామ్రమూర్తులు. సామాన్యులు. తదాద్యావత్సరము 7-1 రాశులందు లోహమూర్తులు పూర్తి పాపులు. శ్రమకారులు. వేధ గోచారముచే 3-6-89 లగా 1-8-89కు గురుడు శుభుడు. వత్సరమంత శని శుభుడు. 20-5-89 లగా 27-1-90కు రాహువు పాపి. వత్సరమంతా కేతువు పాపి. ఆషాఢ మాసము వరకు అన్ని రంగములయందు జయము. శుభకార్య నిర్వహణము. యత్నీ కృత కార్యసాఫల్యము కలుగును. పిమ్మట శ్రమగా నుండును. శత్రు పీడ వ్యయ ప్రయాసలు వ్యాపారమాంద్యము కలుగును. చైత్ర శు. మానసోల్లాసము- ధనమందుట- పరీక్షలు సులువుగా నుండును. బహు- శుక్లము కంటే అనుకూలముగా నుండి సర్వత్రా జయము కలుగును. పుత్ర సంతాన ప్రాప్తి. వైశాఖ శు. ఆందోళన తగ్గును. అన్ని రంగములలో వ్యతిరేకత సడలిపోవును. స్వల్పనారోగ్యము. బహు. లాభము కలుగును. వ్యాపారాభివృద్ధి, పరీక్షలలో జయము, ఖర్చు హెచ్చు, జ్యేష్ఠ శు. గతము వలె జయప్రదముగ నుండును. బహు. కొలది లాభము. అధిక వ్యయము. ప్రయాణ బడలిక. స్వల్పనారోగ్యము. ఆషాఢ శు. అవసరపు ఖర్చులు మీద పడుట. ఋణభారము. మానసికాందోళనము కలుగును. బహు. కుటుంబమున ఇబ్బందులు. ధనమున కిరకాటు స్థితి. శ్రావణ శు. రాజకీయ చిక్కులు. మాన హాని. పలుకుబడి తగ్గును. బహు. వ్యాపారపు చిక్కులు. రాజకీయ కుతంత్రములకు లోనైనను మనోధైర్యము చెడదు. భాద్రపద శు. పూర్వమువలె నుండును. బహు. అన్ని రంగములయందు పురోభివృద్ధి కలుగును. సర్వ సౌఖ్యములతో తులతూగుదురు. ఆశ్వయుజ శు. కొంచెము శ్రమకు గురికాక తప్పదు. రాహు సంచారము. శ్రమనిచ్చినను కొంత లాభదాయకంగా ఉండును. బహు. కర్షకులకు, వ్యాపారులకు ప్రీతిగా నుండును కార్తీకమున పంట రాబడి కొంత తగ్గును. మనోధైర్యముతో వ్యవహరింతురు. మార్గశిర శు. ధనలేమిచే బాధపడుదురు. కుటుంబ సౌఖ్యము స్వల్పము. బహు సాటివార్లలో పేరు వచ్చును. వృత్తిలో నభివృద్ధి, ఆదాయాభివృద్ధి. పౌష శు. కొన్ని రంగముల

యందు చిక్కులు. రాజదండము. అనారోగ్యము. కుటుంబ కలహములు వచ్చును. బహు. మధ్యరకముగా నుండును. శ్రమ తగ్గును. మాఘ శు. వ్యవసాయమున ఆదాయము వచ్చును. విద్యారంగమున నుత్సాహముగా నుండును. బహు. ఆరోగ్యము, శత్రు క్షయము కలిగినను ధనమున కిక్కట్లు తప్పదు. ఫాల్గునమున శ్రమకు గురికాక తప్పదు. శని చలనమువలన ఆదాయాభివృద్ధి. ఆరోగ్యము కుంటుపడును. వీరికి 4-16-23-28 తారీఖులు ఆది, గురువారములు ప్రశస్తము. గురు, రాహుకేతువులకు జపదానములు గావించిన ప్రశస్తతమముగా నుండును. విష్ణు సహస్రనామ స్తోత్ర పారాయణముచే శుభప్రదముగా నుండును.

**పుష్యమి వారలకు :** 2-7-89 లగా. ఆ వత్సరం గురుడు శుభుడు. వత్సరాది ప్ర. 20-5-89కు రాహువు పాపి. వత్సరమంతా శని, కేతువులు శుభులు.

**ఆశ్రేష వారలకు :** వత్సరమంతా గురు కేతువులు పాపులు. వత్సరాది ప్ర 27-1-90కు రాహువు పాపి. వత్సరమంతా శని,శుభుడు.

## సింహము:- సౌరగోచారము (సింహ మాసమున జన్మించిన వారికి)



చాంద్రగోచారము (మఘ 4 పా, పూ. ఫల్గుని 4 పా, ఉ. ఫల్గుని 1వ పా)

### ఆదా 5, వ్యయ 5, రాజ 7, అవ 7

వత్సరాది ప్ర. జ్యేష్ఠ బ. ౧౪ ఆది 2-7-89 వారముకు రాజ్యమున గురుడు లోహమూర్తి. పూర్తి పాపి. శ్రమకారి. తదాద్యా వత్సరము లాభ గురుడు సువర్ణమూర్తి. పూర్తి శుభుడు. వత్సరాది ప్ర. ఫాల్గుణ బ. ౮ మంగళ 20-3-90 వారముకు పంచమ శని, తామ్రమూర్తి. సామాన్య పాపి. తదాద్యా వత్సరము షష్ఠ శని రజతమూర్తి. పూర్తి శుభుడు. వత్సరాది ప్ర. భాద్రపద బ. ౯ శని 23-9-89 వారముకు రాహుకేతువులు 7-1 రాశులయందు రజతమూర్తులు సామాన్యులు. తదాద్యావత్సరము 6-12 రాశులయందు సువర్ణమూర్తులు అర్ధాధిక శుభులు. వేదగోచారముచే 3-6-89 లగా 1-8-89కు గురుడు శుభుడు. ఉగాది లగా. 20-3-90కు శని శుభుడు. 23-9-89 లగా అవత్సరము రాహువు పాపి. వత్సరమంతా కేతువు శుభుడు ఇట్లు పర్యాలోచన చేయగా ఆషాఢ మాసము వరకు చాలా శ్రమగా నుండును. వేద గోచారము సామాన్యగా నున్నందున కొన్ని వ్యాపారములు స్తంభించును. మొత్తము ఈ సంవత్సరమున శుభకార్య నిర్వహణ, శత్రు జయము, ఆదాయ వ్యయములు సమానముగా నుండును. చైత్ర శు. ఆకస్మిక వ్యయము. అనారోగ్యము. ఆర్థిక యిబ్బందులు. అపవాదులు వచ్చును. బహుళమున కొద్దిపాటి మేలుగా నుండును. వైశాఖమున పరీక్షలయందు తప్పక నెగ్గగలరు. మనోవేదన కలుగును. ఆర్థికముగా బాగుండును. జ్యేష్ఠ శు. ధనలేమి, వ్యాపార మందకొడి. గృహమున కలతలు వచ్చును బహు అన్ని రంగములయందు మధ్య రకముగా ఉన్నను ఆరోగ్యము సరిగా నుండదు ఆషాఢమున ఆదాయాభివృద్ధి. కుటుంబ సౌఖ్యము. శత్రు జయము. రాజకీయమున పేరు ప్రతిష్ఠలు వర్తక వ్యాపారములయందు లాభము కలుగును శ్రావణ శు. సామాన్యారోగ్యము. చెల్లుబడి కాని మాటలు. బహు. రోజులు కష్టముగా సాగును. వాక్పారుష్యము వలన కొన్ని చిక్కులు రాగలవు. భాద్రపద శు. పూర్వము వలె నుండును బహు. ధనము చేతికందినట్లు కనబడును. కాని అందదు. వ్యవహారములు చాలా తీవ్రముగా

డును. ఆశ్వయుజ శు. గతములవలె నున్నను రాహువు మార్పు వలన కొద్దిపాటి మంచి చేకూరును. బహు యాభివృద్ధి, మాట చెలాయింపు సౌఖ్యము కలుగును. కార్తీక శు. అన్ని రంగములయందు ముందడుగు వదురు. చాలా మంచి రోజులు. శుభ కార్యముల నిర్వహింతురు. సాటివారిలో మేలనిపించుకొనెదరు. బహు సాన్యముగా నుండును. మార్గశిరమున వ్యయమధికము. ఆడంబరములకు, వ్యసనములకు వశులగుదురు ముున కళత్రమునకు ఆరోగ్య భంగము. మహా వ్యయప్రయాసలు. రాజకీయములలో మానహాని కలుగును. షమున పూర్వము వలె నుండును. ఫాల్గునమున అతి కష్టము మీద రోజులు పొర్చును. అన్ని ములయందు వ్యతిరేకత పొడ సూపును. శని మార్పు వలన కొంచెము మేలు కలుగును. వీరికి 5–17–24–29 ఖులు సోమ, శుక్రవారములు ప్రశస్తమైనవి. గురు, రాహుకేతువులకు జపదానములు గావించిన మేలుగా డును. సూర్య నమస్కారములు, రుద్రాభిషేకము చేయించిన మేలుగా నుండును

మఘవారికి:– వత్సరమంతయు గురు కేతువులు పాపులు. 23–9–89 లగా ఆవత్సరం రాహువు పాపి. రాది ప్ర. 20–3–90కు శని శుభుడు.

పూర్వ ఫల్గుని వారలకు : వత్సరమంత గురుడు పాపి. వత్సరాది ప్ర. 20–3–90కు శని పాపి. వత్సరమంత రాహుకేతువులు శుభులు.



**కన్య:– సౌరగో చారము (కన్యామాసములో పుట్టినవారికి)**

**చాంద్రగో చారము (ఉత్త ఫల్గుని 2–3–4 పా, హస్త 4 పా, చిత్ర 1–2 పా)**

**ఆదా 8, వ్యయ 11, రాజ 3, అవ 3**

వత్సరాది ప్ర. జ్యేష్ఠ బ ౧౪ ఆది. 2–7–89 వారముకు భాగ్య గురుడు సువర్ణమూర్తి. పూర్తి శుభుడు. తారభ్యా వత్సరము రాజ్యములో గురుడు తామ్రమూర్తి. పూర్తి పాపి. వత్సరాది ప్ర. ఫాల్గున బ ౯ మంగళ –3–90 వారముకు అర్ధాష్టమ శని రజతమూర్తి. అర్ధాష్ట శుభుడు. తత్ప్రభృతి ఆ వత్సరము పంచమ శని హమూర్తి పాపి. వత్సరాది ప్ర. భాద్రపద బ ౯ శని 23–9–89 వారముకు రాహుకేతువులు 6–12 శులయందు సువర్ణమూర్తులు అర్ధాధిక శుభులు. తదాద్యావత్సరము 5–11 రాశులయందు రాహుకేతువులు మూర్తులు సామాన్యులు. వేద గోచారముచే 2–7–89ల ఆవత్సరము గురుడు శుభుడు. ఉగాది లగా –3–90కు శని పాపి. వత్సరమంతా రాహుకేతువులు శుభులు. ఇట్లు పర్యవేక్షణ చేయగా శుభకార్యములు రుగును. అనారోగ్యము, ధనమునకు కటకట. వ్యాపార చిక్కులు మనో వ్యాకులత. భయము తరచూ గుచుండును. చైత్ర శు. శుభాశుభ మిశ్రమముగా ఉండును. ఆరోగ్య భంగము. కొన్ని పనులు చాతుర్యముతో సెదరు. బహు ఆర్థిక చిక్కులు. కర్షక వ్యాపారములకు ప్రతిబంధకములు కలుగును. వైశాఖమున ఆర్థిక చిక్కులు లగును. వృత్తి వ్యాపారములలో ప్రతిబంధకములేర్పడును. కుటుంబమునందు అభిప్రాయభేదములు కలుగును ్ష శు. కుజుని మార్పు వలననుకూల పరిణామము కలుగును. ఆర్థిక ఇబ్బందులు తొలగును బహు మిత్రుల లన కార్యసిద్ధి. కుటుంబ సౌఖ్యము. వృత్తి వ్యాపారములలో లాభము. పరీక్షలలో జయము కలుగును ఆషాఢ . అన్ని రంగములయందు మంచి అనుకూల పరిస్థితులేర్పడును. ఉద్యోగావివృద్ధి అధికారుల మన్నన లుగును. బహు. ఉద్యోగములో, వృత్తిలో మంచి మార్పు వచ్చును. శ్రావణమున ఆర్థిక సమస్యలను దుర్కొన వలెను. అనారోగ్యము. వృత్తి వ్యాపారములలో చిక్కులు. మానహాని. కుటుంబ కలతలు కలుగును. ాద్రపద శు. ఉద్యోగులకు, వర్తకులకు, రాజకీయ వాదులకు సామాన్యముగా నుండును. మధ్య రకము వారికి ష్టతమముగా నుండును. కొంచెమనుకూలము. ఆమనుకు అవనపు సొమ్మందును. ఆశ్వయుజ శు. పంటలు

సాధారణముగా నుండును కొన్ని వ్యాపారములు చింకం నడుచును. సౌఖ్యమల్పము. బహు. రాహుకేతువుల మార్పు వలన లాభం చేకూరును. కార్తీక శు. రోజులు సామాన్యముగా నడుచును. అనారోగ్యము. ఔషధ సేవ తప్పదు. కుటుంబములోని వారికి కలతలు వచ్చును. బహు. అనుకూలముగా నుండి ఇంటనారోగ్యము చేకూరును. ఆర్థిక ఇబ్బందులు తొలగును. మార్గశిరమున యథోచితముగా నుండును. ఆదాయ వ్యయములు సమానముగా నుండును. వృత్తి వ్యాపారములు సరళముగా నుండును. పౌషము పూర్వము వలె నుండును. మాఘ శుక్ల అనారోగ్యము. కొన్ని వ్యాపార చిక్కులున్నను ధైర్యముతో రోజులు గడుపుదురు. బహు. పంటలో మిగులు కనిపించును. బంధు సమాగమము. సరసోక్తులు. మధుర పదార్థ భక్షణము ఫాల్గున శు. వస్త్రకొద్యోగములయందు జయ సూచనలు కలవు. ఆదాయము హెచ్చు. కుటుంబానందము. సర్వ సౌఖ్యము. బహు. శుక్లము కంటె శ్రమగా నుండును. కొద్దిపాటి ఇరకాటకముగా నుండును. వీరికి 6–18–25–30 తారీఖులు మంగళ, శనివారములు ప్రశస్తమైనవి. ఆషాఢము నుండి గురునకు వత్సరమంత శనికి జపదానములు చేసిన మేలు

ఉత్తర ఫల్గుని వారలకు వత్సరమంత గురుడు పాపి. వత్సరాది ప్ర. 11–2–90కు శని శుభుడు. వత్సరమంత రాహుకేతువులు శుభులు

హస్త వారలకు : 1–8–89 లగా ఆవత్సరం గురుడు శుభుడు. వత్సరాది ప్ర. 11–2–90కు శని పాపి. వత్సరమంతా రాహుకేతువులు శుభులు

చిత్ర వారలకు : 3–6–89 లగా 1–8–89కు గురుడు శుభుడు. వత్సరమంతా శనిరాహువులు శుభులు. వత్సరమంతా కేతువు పాపి.



**తుల:– సౌర గో చారము (తులా మాసములో పుట్టిన వారికి)**

**చాంద్రగో చారము (చిత్ర 3–4 పా. స్వాతి 4 పా. విశాఖ 1–2–3 పాదం)**

**ఆదా 5, వ్యయ 14, రాజ 6, అవ 3**

వత్సరాది ప్ర జ్యేష్ఠ బ ౧౪ ఆది 2–7–89 వారంకు అష్టమ గురుడు తామ్రమూర్తి శ్రమకారి తదాద్యావత్సరము భాగ్యగురుడు రజతమూర్తి త్రిపాదాధిక శుభుడు. వత్సరాది ప్రభృ. ఫాల్గున బ ౯ మంగళ 20–3–90 వారంకు తృతీయ శని సువర్ణమూర్తి. పూర్తి శుభుడు. తదాద్యావత్సరము అర్ధాష్టమ శని తామ్రమూర్తి పాపి. వత్సరాది ప్ర భాద్రపద బ ౯ శని 23–9–89 వారంకు రాహుకేతువులు 5–11– రాశులందు లోహమూర్తులు. సామాన్యులు తదాద్యావత్సరము 4–10 రాశులందు రాహుకేతువులు రజతమూర్తులు సామాన్యులు వేద గోచారముచే వత్సరాది ప్ర 2–7–89కు గురుడు శుభుడు. 11–2–90ల ఆవత్సరం శని పాపి. వత్సరమంతా రాహు శుభుడు. వత్సరమంతా కేతువు శుభుడు. ఉగాది ల. ఆషాఢ మాసం వరకు శ్రమగ నుండును తర్వాత వృత్తి ఫాల్గున బ ౯ వరకు అనుకూల పరిస్థితులేర్పడగలవు వత్సరాంతమున కొద్ది మార్పులు రాగలవు ఇల్లో పున శుభకార్యములు జరుగుట. ఉద్యోగములో ప్రమోషన్లు, వ్యవహారములయందు జయము కల్గును చైత్ర శు ఆదాయమునకు మించిన వ్యయము అనారోగ్యము. వ్యాపారములు స్తంభించుట జరుగును. బహు. శుక్లము కంటె శ్రమగా ఉన్నను ఉత్సాహముగా పని చేయుదురు. వైశాఖ శు. కొన్ని రంగముల యందభివృద్ధిగ నుండును. ఔషధ సేవ తప్పదు. భయము. మానసికాందోళన తప్పదు. బహు. రాజకీయ వత్తిడి– అగౌరవము– కలహము కలుగును. జ్యేష్ఠ శు. ఋణబాధ ధారా పుత్రాదుల కనారోగ్యము

ద్యోగమునందు చిక్కులు శ్రమగ నుండును. బహు. కొద్దిపాటి అనుకూలముగ నుండును. గౌరవ ప్రతిపత్తులు కలుగును. ఆషాఢ శు. గురుని మార్పు వలన సుఖము. కార్యసిద్ధి. వృత్తి వ్యాపారముల మందనుకూల మార్పులు కల్గును. బహు. శుద్ధము కంటె బాగుగా నుండును. శ్రావణమున గృహమునందు శుభకార్యములు. పుత్ర సంతాన ప్రాప్తి. ఆరోగ్యం కుదుటపడుట. ఉద్యోగమునందు ప్రమోషన్లు రాగలవు. బహు. శుభాశుభ మిశ్రమముగ నుండును. కొద్దిపాటి అనారోగ్యముగ నుండును. ఆదాయమునకు మించిన వ్యయమగును. ఆశ్వయుజమున ఉద్యోగమునందవకతవకలుగ నున్నను నేర్పుతో చిక్కు సమస్యల నధిగమించుకుందురు. గృహమున నూతనమగు పేచీలు తలయెత్తగలవు. కార్తిక శు వ్యవసాయదారులకు సామాన్యమగు ఆదాయము ఉద్యోగమునందు కొంత సుముఖత కల్గును వృత్తి వ్యాపారములలో కొంచెం మెరుగగును. బహు. శుక్లమువలె నుండును. మార్గశిర శు. కొంత శ్రమయనిపించును. ఆదాయ వ్యయములు సమానముగ నుండును. ఇరుగు పొరుగు వారితో పేచీలు తప్పవు. బహు. వృత్తి వ్యాపారములలో శ్రమ తగ్గును. ఆదాయమున నెక్కువ లాభము కనిపించును. పౌషము మార్గశిరమువలె నుండును మాఘ శు. అంతట జయభేరీ మ్రోగును. ఆరోగ్యమనుకూలము. వృత్తి వ్యాపారములయందాకస్మిక ధనలాభము. బహు. కొంచెము కేడాలో శుక్లమువలె నుండును. ఫాల్గునమున శ్రమగ నుండును. ఋణ బాధ. ఇంట బయట పేచీలు. అధిక వ్యయముతో శ్రమపడుదురు. వీరికి 7-19-26-31 తేదీలు అది. బుధవారములు ప్రశస్తములు ఈ రాశివారు తరుచుగా సోమవారమున రుద్రాభిషేకము చేయించిన మేలుగా నుండును.

స్వాతివారలకు · 3-6-89 లగా 2-7-89కు గురుడు పాపి. వత్సరాది ప్ర. 20-5-89కు రాహువు ప్రాపి. వత్సరమంత శని కేతువులు శుభులు.

విశాఖవారలకు:- వత్సరాది ప్ర. 2-7-89కు గురుడు శుభుడు. 20-5-89 లగా 27-1-90కు రాహువు పాపి వత్సరమంత శనికేతువులు శుభులు.

వృశ్చికము:- సౌర గోచారము (వృశ్చిక మాసములో పుట్టినవారికి)
చాంద్రగోచారము (విశాఖ 4వ పా. అనూరాధ 4 పా, జ్యేష్ఠ 4 పా) 
ఆదా 11, వ్యయ 5, రాజ 2, అవ6)

వత్సరాది ప్ర. జ్యేష్ఠ బ ౧౪ అది 2-7-89 వారంకు సప్తమ గురుడు రజతమూర్తి శుభుడు. తదాద్యావత్సరము అష్టమ గురుడు లోహమూర్తి. పూర్తి పాపి శ్రమకారి. వత్సరాది ప్ర. ఫాల్గున బ ౮ మంగళ 20-3-90 వారంకు ద్వితీయమున శని లోహమూర్తి పూర్తి పాపి శ్రమకారి. తదాద్యావత్సరము తృతీయమున శని. రజతమూర్తి - శుభుడు. వత్సరాది ప్ర. భాద్రపద బ ౯ శని 23-9-89 వారంకు రాహుకేతువులు 4-10 రాశులయందు సువర్ణమూర్తులు. అర్ధ శుభులు. తదాద్యావత్సరము 3-9 రాశులయందు లోహమూర్తులు సామాన్య పాపులు. వేధ గోచారముచే వత్సరమంతా గురుడు పాపి. 11-2-90 లగా. ఆ వత్సరమంతా శని పాపి.

...రమంతా రాహు కేతువులు శుభులు ఇట్టి పర్యవేక్షణ చేయగా ఆషాఢ మాసంలోగా శుభకార్యములు ...ర్తి ంచుట జరగవచ్చును. పిమ్మట అష్టమ గురుడు ఏలినాటి శని అనారోగ్యము. ఋణ బాధ. అన్ని ...ములు దిగ్భ్రంధమగుట. రాజకీయ వత్తిడి వివాదము కలుగును. చైత్ర శు. ఆరోగ్యము మేలు. సౌఖ్యము ...గను. అన్ని పనులు చక్కబడును. బహు. శుక్లము కంటే కొద్దిపాటి శ్రమగ నుండును. వైశాఖ శు. కార్యమునకధిక వ్యయమగును. కొద్దిపాటి అనారోగ్యము. ఇంట బయట పేచీలు. బహు. శుక్లము కంటె శ్రమ ...డును. జ్యేష్ఠ శు. వృత్తి వ్యాపారములలో ఒడిదుడుకులుగా నుండును. ఉద్యోగమునందు అధికారులతో ...ణగా నుండును. బహు. శుక్లవలె నుండును. ఈతి బాధలెక్కువగును. ఆషాఢ శు. మానసికాందోళనము. ...మరవు. అసంబద్ధముగ మాట్లాడుట. ఎవరును మాట లెక్క చేయక పోవుటయును. లావాదేవీలెక్కువగుట ...గును. శ్రావణ శు. మధ్య రకముగు ఆరోగ్యము. రాజకీయ ప్రతిబంధకములు కొంత మెరుగుపడుట మానవహాని ...గును. బహు. శుభ కార్య ప్రయత్నములు. ఒక కొలికికి వచ్చును. పంట పర్యాయములయందు లాభ శాతము ...డును. భాద్రపదమున మంచి అనుకూలముగ నుండును. అన్ని రంగములయందు మంచి కదలికగ ...డును. ఆదాయము బాగుండును. ఆశ్వయుజ శు. శుభకార్యములయందు పాల్గొనుట. గృహమునందధిక ...ము. వృత్తి వ్యాపారములయందు మంచి అనుకూలత. పరీక్షలయందుత్తీర్ణత కలుగును. బహు. శుక్లము ...కు తక్కువగ నున్నను రాబడికి లోటుండదు. కార్తిక శు. అధికారుల ఆగ్రహమునకు గురికాక తప్పదు. త్రిప్పట. ...ణములు కలుగును. బహు. ఇంట సౌఖ్యము. ఉద్యోగమునందు పలుకుబడి. అధిక శాతం రాబడి ...ండును. మార్గశిరమున అనుకూలమగు పరిణామము కలిగి అన్నిట జయము కల్గును. మాట పలుకుబడి ...ను. పౌష శు. కొన్ని రంగములయందు జయము. ఆదాయమునకు మించిన వ్యయము. బహు. గతమువలె ...డును. మాఘము పౌషమువలె నుండును. ఫాల్గునమున అన్ని రంగముల అభివృద్ధిగ నుండును. ఏలినాటి ...మార్చి 20తో వదలినది. ఆరోగ్యం లావాదేవీలు అన్ని రంగముల జయము కలుగును. వీరికి 8-20-27 ...తేదీలు సోమ, గురువారములు ప్రశస్తములు. వీరు గురు శనులకు రాహువునకు జపదానములు, సుందర ...కాండ పారాయణము మంచిది.

అనూరాధ వారలకు:- వత్సరమంతా గురుడు పాపి. 23-9-89 లగా. ఆ వత్సరము కేతువు పాపి. ...వత్సరమంతా శని రాహువులు శుభులు.

జ్యేష్ఠవారలకు : వత్సరమంతా గురుడు పాపి. వత్సరాది ప్ర. 20-3-90కు శని పాపి. వత్సరమంతా ...రాహుకేతువులు శుభులు.



**ధనుస్సు:- సౌరగోచారము- (ధనుర్మాసములో పుట్టిన వారికి)**

**చాంద్రగోచారము (మూల 4 పా, పూర్వాషాఢ 4 పా, ఉత్తరాషాఢ 1వ పాదము)**

**ఆదా 14, వ్యయ 11, రాజ 5, అవ 6**

వత్సరాది ప్ర. జ్యేష్ఠ బ ౧౪ ఆది 2-7-89 వారంకు షష్ఠ గురుడు లోహమూర్తి. పూర్తి పాపి శ్రమకారి. తదాద్యావత్సరము సప్తమ గురుడు తామ్రమూర్తి అర్ధశుభుడు. వత్సరాది ప్ర. ఫాల్గున బ ౮ మంగళ 20-3-90 వారంకు జన్మమున శని సువర్ణమూర్తి. అర్ధశుభుడు. తదాద్యావత్సరము ద్వితీయమున శని సువర్ణమూర్తి- అర్ధ శుభుడు. వత్సరాది ప్ర. భాద్రపద బ ౯ శని 23-9-89 వారంకు 3-9 రాశుల యందు

రాహుకేతువులు తామ్రమూర్తులు. అర్ధ శుభులు. తదాద్యా వత్సరము 2-8 రాశుల యందు తామ్రమూర్తులు పాపులు- శ్రమకారులు. వేధగోచారముచే వత్సరమంతా గురుడు పాపి. వత్సరమంతా శని రాహుకేతువులు శుభులు. వీరికి ఆషాఢమాసం వరకు శ్రమగ నుండును. తత్పూర్వమే భాద్రపద బ ౯ 23-9-89కు అనారోగ్యము- ఋణబాధ- వివాహాది శుభకార్యములు మహా ప్రయత్నముతో సిద్ధించును. తదాద్యావత్సరము రాజకీయములలో వత్తిడి కలిగినను వేధగోచారముచే వత్సరమంతయు శని రాహు కేతువులు శుభులుగాన వత్సర మంతయు మధ్యమ రకముగా నుండును. చైత్ర శు ఆర్థికముగ శ్రమగ నుండును ఆరోగ్యము మెరుగా నుండును బహు. పరీక్షలయందు ఉత్తీర్ణత వ్యవహారముల యందు ఒడుదుడుకులు తగ్గును వైశాఖ శు. అన్ని పనులు నెరవేరును. కళత్రమున కనారోగ్యము ఆదాయమునకు మించిన ఖర్చు మాట విలువ తగ్గును. బహు. అత్యధిక శుభదాయకముగ నుండును. వ్యవసాయము మధ్యరకముగ నుండును. జ్యేష్ఠ శు. వైశాఖ బహుళము వలె నుండును. బహు శ్రమగ నుండును. వృత్తి వ్యాపారముల యందు ప్రతిష్ఠంభన కలుగును. ఆషాఢ శు గురు మార్పు వలన మంచి పంట. వృత్తి వ్యాపారముల యందభివృద్ధి కలుగును. ఆషాఢ బహు. శుభాశుభ మిశ్రమముగ నుండును స్వల్పాదాయము. అనారోగ్యము కల్గును. శ్రావణ శు. గతమువలె నున్నను, అనారోగ్యము ఔషధ సేవ అవసర మగును. బహు. ఆదనుకు ధన మందును. వృత్తి, వ్యాపారములలో కలసి వచ్చును. భాద్రపద శు. అన్ని రంగములయందు మంచి కదలిక కల్గును. ఉద్యోగస్థు లధికారుల మన్నను పొందుదురు. బహు. అధికారుల యాశ్రయముతో హోదా పెరుగును. వృత్తి వ్యాపారములలో లాభ శాతము కల్గును. ఆశ్వయుజమున రాహుకేతువుల మార్పు వలన కొన్ని రంగముల యందు సామాన్యాభివృద్ధి సుఖానందములు కలుగును. కార్తిక శు. పంట అభివృద్ధి. ఆకస్మిక ధన లాభం. ఇంట బయట మాట చెలాయింపుగ నుండును. బహు. అనుకూలారోగ్యం. వ్యయ మధికం. వృత్తి వ్యాపారములు మధ్యమముగ నుండును. మార్గశిరమున అనారోగ్యము. రాబడి తక్కువ. వృత్తి వ్యాపారములలో కొన్ని చిక్కులు వచ్చును. పౌషమాసము గతమువలె నుండును. మాఘ శు. అన్ని రంగముల యందు సాధారణ పరిస్థితులు. ఆదాయ వ్యయములు సమానము. బహు. అభివృద్ధికరముగ నుండును. ఫాల్గునమున శుభాశుభ మిశ్రమముగ నుండును. శని మార్పు వలన కొంత మేలు కలుగును. వీరికి ఏలనాటి శనిలో మూడవ ఖండము ప్రారంభమై శ్రమగ నుండును. వీరికి 3-9-21-28 తేదీలు మంగళ, శుక్ర వారములు ప్రశస్తము. ఈ రాశి వారు గురునకు జప దానములు చేయవలెను. లలితా సహస్రనామ పారాయణ చేయవలెను.

మూలవారికి : వత్సరమంత గురు రాహువులు పాపులు వత్సరాది ప్ర. 20-3-90కు శని శుభుడు వత్సరమంతా కేతువు శుభుడు.

పూర్వాషాఢవారలకు:- 1-8-89 లగా. ఆ వత్సరం గురుడు శుభుడు. వత్సరమంతా శని రాహు కేతువులు శుభులు.

**మకరము:- సౌరగోచారము- (మకర మాసములో పుట్టిన వారికి)**

**చాంద్రగోచారము ( ఉత్తరాషాఢ 2, 3, 4 పా. శ్రవణం 4వ పా. ధనిష్ఠ 1, 2 పా)**

**ఆదా 2, వ్యయ 8, రాజ 1, అవ 2**

వత్సరాది ప్ర. జ్యేష్ఠ బ ౧౪ ఆది 2-7-89 వారంకు పంచమ గురుడు తామ్రమూర్తి అర్ధ శుభుడు. తదాద్యావత్సరము షష్ఠ గురుడు సువర్ణమూర్తి అర్ధశుభుడు. వత్సరాది ప్ర. ఫాల్గున బ ౮ మంగళ 20-3-90 వారంకు వ్యయమున శని తామ్రమూర్తి. పూర్తి పాపి. తదాద్యావత్సరము జన్మమున శని లోహమూర్తి పూర్తి పాపి. శ్రమకారి. వత్సరాది ప్ర. భాద్రపద బ ౯ శని 23-9-89 వారంకు రాహుకేతువులు 2-8 రాశులయందు

వ్యవసాయ వ్యాపారములలో మెలుగా నుంతును కార్తీక ను అధిక వ్యయము. అనారోగ్యము. పరిక్షలు గన్ముగ నుంతును వ్యవసాయముమన శ్రమకు ఫలం చేకూరదు. ఒహు. మంచి చెష్నల కలయికతోను, శత్రువుల పీడ కల్గును మార్గశిర ను. గతము వలె నుంతును ఐహు. శత్రువుల అలజడి మెంతుగా నుంతును. ఉద్యోగుల కధికారులతో భేటి వచ్చును పౌష ను కుటుంబ కలహములు. పలుకుబడి. ఉద్యోగుల కధికారుల మన్నన

లభించును. ఐహు. శుష్కముపలె నుంతును మాఘమున ఋణబాధ. లావాదేవీలతో చాల శ్రమగ నుంతును. అనారోగ్యము. ఫాల్గుణము గతముపలె నుంతును. 10-22-29 తేదీలు. బుధ. శని వారములు వీరికి ప్రశస్తమయినవి. శని రాహు కేతువులకు జపము చెయించుట ముఖ్యము

ఉత్తరాషాఢవారలకు 3-6-89 లగా 1-8-89కు గురుడు శుభుడు. వత్సరమంత శని రాహు కేతువులు శుభులు

శ్రవణం వారలకు:- వత్సరమంతా గురుడు పాపి. వత్సరాది ప్ర. 20-3-90కు శని శుభుడు. 20-5-89 లగా ఆ వత్సరం రాహువు పాపి. వత్సరాది ప్ర. 23-9-89కు కేతువు పాపి.

ధనిష్ఠ వారలకు:- వత్సరమంతా గురుడు పాపి వత్సరమంత శని శుభుడు. 23-9-89 లగా. 27-1-90కు రాహువు శుభుడు 23-9-89 లగా. ఆ వత్సరం కేతువు పాపి.

...జతమూర్తులు పాద శుభులు. తదాద్యా వత్సరము 1-7 రాశులయందు సువర్ణమూర్తులు. అర్ధ శుభులు ...ధగోచారముచే వత్సరమంతా గురుడు పాపి. వత్సరమంతా శని శుభుడు. 23-9-89 లగా 27-1-90కు ...రాహువు శుభుడు. వత్సరాది ప్ర. 23-9-89కు కేతువు పాపి స్థితి గోచారములో గురుడు, వేధ గోచారములో శని ...వత్సరమంతా శుభులు. రాహుకేతువులు స్థితి వేధ గోచారములలో సామాన్యముగనున్నారు గాన అక్టోబరు లగా ...జనవరిలోగా వివాహాది శుభ కార్యములు జరుగుటకు ప్రమోషన్లు వచ్చుటకు వృత్తి వ్యాపారములలో లాభము ...వచ్చుటకు వీలుగా నుంతును. చైత్ర శు. శుభకార్య నిర్వహణ. రాజకీయములలో జయము. ఇంట బయట మాట ...చెలాయింపుగ నుందును. బహు. ఆరోగ్యము కరచు గట్టిన వ్యాపారములు సాఫల్యం వచ్చును. వైశాఖ శు. అన్ని ...పనులు నెరవేరును. ఖర్చు లధికమైనను సంతోషముగ నుంతును. బహు. స్త్రీ సౌఖ్యము ఆరోగ్యము మేలు ...జ్యేష్ఠ శు. అవసరములకు ధన ముండును. అధికారుల గౌరవము లభించును. బహు. ఆదాయ వ్యయములు ...సమానముగ నుంతును. ఇక్కట్లు కొలదిగ నుంతును ఆషాఢ శు గురుని మార్పు వలన శ్రమ కలిగినను ...మూర్తిమంతము మంచి వగుటవలన అధికారుల ఆగ్రహము తగ్గును. బహు. ధనమునకు కటకట తప్పదు

...ఇంట బయట చిలిపి పేచీలు తప్పవు. సాటి వారిలో గౌరవము తగ్గును. శ్రావణమున ఆరోగ్య భంగము. ...కుటుంబములో దారాపుత్రాదులకు ఔషధ సేవ త్రిప్పట కలుగును. భాద్రపద శు గతమువలె నుంతును బహు. ...డు మేళ్ళ కలయిక. సామాన్యారోగ్యము. ఎంతో శ్రమపడిన గాని కార్యసిద్ధి కాదు. ఆశ్వయుజమున వృత్తి ...వ్యాపారములలో చేతిలో ధన మాడును. ఆరోగ్యం కుదుట పడును. శుభకార్య ప్రయత్నములు ఫలించ గలవు

**కుంభము:-** సౌరగోచారము- (కుంభ మాసమున జన్మించిన వారికి)

చాంద్రగోచారము (ధనిష్ఠ 3, 4 పా. శతతార 4వ పా. పూర్వాభాద్ర 1, 2, 3 పా)

ఆదా 2, వ్యయ 8, రాజ 4, అవ 2

వత్సరాది ప్ర. జ్యేష్ఠ బ ౧౪ అది 2-7-89 వారంకు అర్ధాష్టమ గురుడు. సువర్ణమూర్తి. అర్ధ శుభుడు. తదాద్యావత్సరము పంచమకోణ గురుడు. రజతమూర్తి శుభుడు. వత్సరాది ప్ర. ఫాల్గున బ ౮ మంగళ 20-3-90 వారంకు శని లాభమున రజతమూర్తి. తదాద్యావత్సరము వ్యయమున శని సువర్ణమూర్తి. అర్ధ శుభుడు. వత్సరాది ప్ర. భాద్రపద బ ౯ శని 23-9-89 వారంకు 1-7 రాశులయందు రాహుకేతువులు లోహమూర్తులు పూర్తి పాపులు. తదాద్యావత్సరము 12-6 రాశుల యందు రజతమూర్తులు త్రిపాద శుభులు. వేధగోచారముచే వత్సరమంతా గురుడు పాపి. వత్సరాది ప్ర. 20-3-90కు శని శుభుడు. 20-5-89 లగా ఆ వత్సరం రాహువు పాపి. 23-9-89 లగా ఆ వత్సరం కేతువు పాపి. ఈ వత్సరమంతా అనుకొన్న పనులు నెరవేర గలవు. శుభకార్య నిర్వహణ రాజకీయములయందు జయము. ఉద్యోగులకు మంచి ప్రమోషన్లు రాగలవు. అధిక శాతములో పంటలు పండును. కుటుంబ సౌఖ్యము కల్గును. పరీక్షలు సులువుగా నుండును. చైత్ర శు. వ్యవహారములయందు జయము. ఆరోగ్యం మేలు. ఆదాయాభివృద్ధి కలుగును. బహు. ధనము చేతికందును. మానసి కాందోళనము. వ్యవహారముల పరిష్కారము. పరీక్షలలో ఉత్తీర్ణత జరుగును. వైశాఖ శు. సాటి వారిలో గౌరవము. సంతానమున కనారోగ్యము ఔషధ సేవ అవసరమగును. బహు. కొంచె మెంచుమించుగా శుక్లమువలె నుండును. జ్యేష్ఠమున అన్ని రంగములయందు జయము. అభీష్ట సిద్ధి. దారాపుత్రాదులతో సౌఖ్యము. శుభ కార్య ప్రయత్నములు నెరవేరును. ఆషాఢ శు. తొందరగ అవివేకపు మాటలు. గురు చలనము వలన అనుకూల పరిణామము కలుగును. అన్ని రంగముల యందు అమితోత్సాహము కలుగును. శ్రావణ శు.

శుభాశుభ మిశ్రమముగ నుండును. కళత్రమున కనారోగ్యము. బహు. వృత్తి వ్యాపారముల యందు శ్రమకు తగిన ఫలముండదు. మాట విలువ ఉండదు. భాద్రపద శు. గతమువలె నుండును. బహు. అన్ని రంగముల యందు తిరుగుబాటుగ నుండును. అనారోగ్యము చేయునా అని అనిపించు చున్నది. ఆశ్వయుజ శు. రాహువు మార్పువలన కొద్దిపాటి వ్యవహారముల బాధపడును. బహు. అనారోగ్యము చేసినను ఆర్థికమునకు ఇబ్బంది యుండదు. ఉద్యోగ రంగమున మంచి పలుకుబడి సంపాదింతురు. కార్తీకమున ఆరోగ్యము కుదుట పడును. వృత్తి వ్యాపారముల యందుత్సాహముగను పంట బాగుగా ఉండును. ఆకస్మిక ధన లాభము చేకూరును. మార్గశిరము కార్తీకము వలె ఉత్సాహముగ నుండును. పౌషమాసమున అన్ని రంగములయందుత్సాహముగ నుండును. గౌరవ ప్రతిపత్తులు పొంద గలరు. మాట చెలాయింపుగా నుండురు. కొద్దిపాటి శ్రమ తప్పదు. మాఘమున శుభకార్య నిర్వహణ శత్రు జయము మిగుల ఎక్కువగా ఉండును. ఫాల్గునమున శ్రమ, పీడ, అనారోగ్యము. దారాపుత్రాదులతో పేచీలు వచ్చునా అని అనిపించుచున్నది. వీరికి 11-20-30 తేదీలు, ఆది, గురు వారములు ప్రశస్తములు. ఈ రాశివారలు శ్రీమద్రామాయణములోని శ్రీరామ పట్టాభిషేక సర్గ పారాయణము చేయుట మంచిది.

**శతతారవారలకు:-** 2-7-89 లగా. ఆ వత్సరం గురుడు శుభుడు. వత్సరమంతా శని రాహు కేతువులు శుభులు.

**పూర్వాభాద్రవారలకు:-** వత్సరాది ప్ర. 2-7-89కు గురుడు శుభుడు. వత్సరాది ప్ర. 11-2-90కు శని శుభుడు. వత్సరమంతా రాహు కేతువులు శుభులు.

**మీనము:-** సౌరగోచారము- (మీన మాసములో పుట్టిన వార్కి)

చాంద్రగోచారము (పూర్వాభాద్ర 4వ పా. ఉత్తరాభాద్ర 4 పా. రేవతి 4 పా.)

ఆదా 14, వ్యయ 11, రాజ 7, అవ 2

వత్సరాది ప్ర. జ్యేష్ఠ బ ౧౪ అది 2-7-89 వారంకు తృతీయ గురుడు రజతమూర్తి సామాన్యుడు. తదాద్యావత్సరము అర్ధాష్టమ గురుడు లోహమూర్తి పూర్తి పాపి. శ్రమకారి వత్సరాది ప్ర. ఫాల్గున బ ౮ మంగళ 20-3-90 వారంకు రాజ్యమున శని లోహమూర్తి. పూర్తి పాపి. శ్రమకారి. తదాద్యావత్సరము లాభమున శని తామ్రమూర్తి అర్ధ శుభుడు. వత్సరాది ప్ర. భాద్రపద బ ౯ శని 23-9-89 వారంకు రాహుకేతువులు 12-6 రాశులయందు తామ్రమూర్తులు. పాపులు తదాద్యావత్సరము 11-5 రాశుల యందు లోహమూర్తులు సామాన్యులు. వేధగోచారముచే 2-7-89 లగా ఆ వత్సరం గురుడు పాపి. వత్సరాది ప్ర. 20-3-90కు శని పాపి. వత్సరాది ప్ర. 20-5-89కు రాహువు పాపి. వత్సరమంతా కేతువు శుభుడు. ఈ రాశివారికి స్మృతి- వేధగోచారములు

చాల దుర్భరముగ నున్నవి. ఏ వ్యవహారమున కైనను సహస్ర విధముల ఆలోచించి చేయాలి. తప్పటడుగు వేయరాదు. పరీక్షలు చాల కష్టముగ నుండును. ఆర్థిక ఇబ్బంది తరచు కలుగును. ఆరోగ్య మంతంత మాత్రముగనే యుండును ఉద్యోగులు బదిలీలు కోరకుండుట మేలు. మౌనము నాచరించుట మంచిది. చైత్ర శు. శ్రమగ నుండును. బహు. కీడు మేల్ల కలయికగా నుండును. అవసరమునకు ధన మందదు. వైశాఖ శు. ఉద్యోగులకు దూరపు బదిలీలు. మానసికాందోళన కలుగును. బహు. వృత్తి వ్యాపారములలో మందగొడిగా నుండి వ్యయము హెచ్చుగా నుండును. జ్యేష్ఠమున శుభాశుభ మిశ్రమముగ నుండును. ఇంట బయట పేచీ లధికముగ నుండును. ఆషాఢ శు. గురుని మార్పు వలన శ్రమ అధికమగును. వృత్తి వ్యాపారములు స్తంభించును. బహు. సామాన్యారోగ్యము. ఔషధసేవ. మానసిక వ్యధ అధికముగా నుండును. శ్రావణమున అనుకూల పరిణామము కలుగును. వ్యవహారములు మంచిగా పరిణమించును. ఆరోగ్యము కుదుట పడును.

ఉద్యోగము నందు గౌరవముగా నుండును. భాద్రపద శు. శ్రావణమువలె నుండును. బహు. ఆదాయమునకు మించిన ఖర్చు కనబడును. ఉద్యోగము నందు శ్రమ యెక్కువ. మన్నన తక్కువ. ఆశ్వయుజమున కేతు సంచారము లాభసూచకముగ నున్నను అధిక గ్రహములు దుష్ట స్థానములలో నున్నందున కొన్ని ఆకస్మిక ఖర్చులు మీద పడును. కార్తీకమున ఆరోగ్య భంగము. ఇంట బయట పేచీలు తలయెత్తును. విభాగముల వరకు- వచ్చును. మార్గశిర శు. కొద్దిపాటి అనుకూల పరిణామము కలుగును. ఋణ బాధ హెచ్చుగా నుండును. బహు. సామాన్యముగ నుండును. పౌషమున చాల అభివృద్ధికరముగను, వృత్తి వ్యాపారములు బాగుగా కొనసాగును. శుభ సంతోషములతో నుండురు. మాఘమున సామాన్యముగ నుండును. ఫాల్గునమున అన్ని రంగములయందు జయము. శుభకార్య నిర్వహణ. బంధుమిత్రుల సరస సల్లాపములతో నుందురు. వీరికి 12-24-31 తేదీలు, సోమ, శుక్ర వారములు ప్రశస్తములు. ఈ రాశివారు గురు శనులకు జపదానములు- ఆదిత్యహృదయ పారాయణ చేయుట మంచిది.

**ఉత్తరాభాద్ర వారలకు.** 1-8-89 లగా ఆ వత్సరం గురుడు శుభుడు. వత్సరాది ప్ర. 11-2-90కు శని పాపి. వత్సరమంతా రాహు కేతువులు శుభులు.

**రేవతి వారలకు:-** 3-6-89 లగా 1-8-89కు గురుడు శుభుడు. వత్సరాది ప్ర. 20-3-90కు శని శుభుడు. వత్సరమంతా రాహువు పాపి. వత్సరమంత కేతువు శుభుడు.

# జాతా శౌచాది విషయములు

స్త్రీలు బహిష్ఠ అయినప్పుడు, పురుడు వచ్చినప్పుడు, మరణము కలిగినను రాత్రి ప్రమాణమును 3చే భాగించగా మొదటి 1-2 భాగములలోగా నగుచో పూర్వదినమనియు 3వ భాగములో నయిన పర దినమనియు లెక్కించనగును. గర్భము 6 మాసములు దాటినది లగాయతు అనగా 7వ మాసము వచ్చినది లగాయతు జ్ఞాతులకు అందరకును ప్రసవాశౌచము 10 రోజులు పట్టవలయును.

మరణా శౌచవము :- శిశువు గర్భమునందే మరణించినచో తల్లిదండ్రులకు జ్ఞాతులకు 10 రోజులు పురుడు. శిశువు జన్మించి నాభిచ్ఛేదము కాకుండగానే మరణించినచో తల్లికి 10 దినములు పురుడు తండ్రికి జ్ఞాతులకు 3 రోజులు జాతాశౌచము. మృతాశౌచము స్నానమాత్రముచే శుద్ధి. శిశువు నాభిచ్ఛేదానంతరము 10 దినములలోపుగా మరణించినచో జ్ఞాతులందరకు జాతాశౌచము కలదు. మృతాశౌచము స్నానమాత్రముచే శుద్ధి.

పురుడు శుద్ధి అయినప్పటి నుండియు దంతోత్పత్తి కాలమగు 6 మాసములలోపుగా శిశువు మరణించినచో తలిదండ్రులకు 3 రోజులాశౌచము, జ్ఞాతులకు స్నానము మాత్రము.

6 మాసములు దాటినది లగాయతు 3 సంవత్సరములు నిండులోగా మరణించిన తల్లిదండ్రులకు 3 దినములు, మగశిశువగుచో జ్ఞాతులకు ఒకరోజు అశౌచము. ఆడపిల్ల యగుచో స్నానమాత్రమే జ్ఞాతులకు చేయదగియున్నది.

3 సంవత్సరములు దాటినది మొదలు ఉపనయ పర్యంతము మగవాడు మరణించిన జ్ఞాతులకు తల్లిదండ్రులకు 3 రోజులాశౌచము. వివాహోపనయనముల కాలము దాటిన స్త్రీ పురుషులు మరణించిన జ్ఞాతులు తలిదండ్రులు 10 రోజులు పూర్ణాశౌచము పట్టవలెను. రజస్వల అయిన స్త్రీ వివాహము కాకపోయినను మరణించినచో 10 రోజులు పూర్ణాశౌచము తల్లిదండ్రులు జ్ఞాతులు పట్టవలెను.

## మృతి విషయమై చెడునక్షత్రములు మొదలగునవి

౧. ౨. ౬. ౭. ౧౦. ౧౨ ౧౩: ౧౪ ఈ తిథులు ఆది, మంగళ, శుక్ర, శనివారములు. కృత్తిక, రోహిణి, మృగశిర్ష, పునర్వసు, మఘ, ఉత్తర, చిత్ర, విశాఖ, ఉత్తరాషాఢ, ధనిష్ఠ, శతతార, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, రేవతి ఈ నక్షత్రములు దోషములు వీటి యందు [illegible] సంభవించినచో గృహమునకు దోషము నక్షత్రము చెడుదైనచో అధిక దోషము. నక్షత్రము మంచిదై [illegible]



ఈ చక్రము సూర్యుడు కృత్తిక నక్షత్రములో నుండగా చూపబడినది. సూర్యుడున్న నక్షత్రము మొదలు మృత నక్షత్రము వర్కు నభిజిత్తుతో కూడా లెక్కించవలెను. సూర్యుడున్న నక్షత్రము ఈశాన్య దిక్కున వ్రాసి అచట నుండి లోపల నాలుగు నక్షత్రములు దిక్కుల యందు వ్రాసి లోపల నుండి వెలుపలకు మూడు నక్షత్రములు దిక్కుల యందు వ్రాయవలెను. అంతరంగము నందయితే మూడు పక్షములు మధ్యయందయితే రెండు పక్షములు దాని తరువాతదయిన నొకపక్షమును గృహమును విడువవలయును. బాహ్యమంత శుభుడు. ఇంక పక్షిణి విషయము.

సన్నిహితమున నున్న త్రిరాత్రిమనియు, అసన్నిహితమయిన 90 ఘటికలనియు కొందరి మతము. మరికొందరు సన్నిహితముననున్నను మృతాహము నుండి 3 దినములు అశౌచముపట్టి నాల్గవ దినమున ఉదయమున శుద్ధియగును. వివాహితులయిన కుమార్తెలకు దౌహిత్ర దౌహిత్రులకు వివాహితయైన పౌత్రికకు దశాహములోగా ఎప్పుడు తెలిసినను త్రిరాత్రమృతా శౌచము పట్టవలెను. 9 లేక 10 రోజులలో మృత విషయమును విన్నను 11వ రోజుదయముననే శుద్ధియగును మృతాహము నుండి 3వ దినము దాటినది లగాయతు దశాహములోగా విన్నచో కొందరు 90 ఘటికలనియు, మూడు దినములు పక్షిణియమనియు, మరికొందరు స్నానమాత్రముతోనే శుద్ధియనియు, మరికొందరు ఒక పగలు ఒక రాత్రి పట్టదగినదనియు నభిప్రాయము కలదు. ఇందు త్రిరాత్రానంతరము దశాహము లోపుగా తెలిసిన ఒక పగలు ఒక రాత్రి అను అభిప్రాయమే యుక్తమని దోచుచున్నది. దీనికి వారివారి సాంప్రదాయము ప్రధానము. దశాహానంతరము తెలిసిన స్నానమాత్రము చేతనే శుద్ధియగును.

ఏకజాతీయములగు అనేకాశౌచములు కలియుటలో నేది మొదట యుత్పన్నమయినచో దానితోనే అంతమగును. తరువాత ఉత్పన్నమయినది మొదట విన్నను మొదట ఉత్పన్నమయినది తరువాత విన్నను మొదట ఉత్పన్నమయిన దానితోనే శుద్ధియగును. మొదట ఉత్పన్నమయిన దశరాత్రమృతాశౌచములో ఏమ్మట ఉత్పన్నమయిన త్రిరాత్రమృతాశౌచము శుద్ధియగును గాని త్రిరాత్రమృతాశౌచములో దశరాత్రమృతాశౌచము శుద్ధి కాదు మొదట ఉత్పన్నమయిన దశరాత్రమృతా శౌచము పట్టుచుండ ఏమ్మట ఉత్పన్నమయిన జాతాశౌచము విన్నను దశరాత్రమృతా శౌచముతోనే శుద్ధి యగును ప్రథమముగా నుత్పన్నమయిన జాతాశౌచమున ఏమ్మట ఉత్పన్నమయిన త్రిరాత్రమృతా శౌచమును శుద్ధి చేసికొని శేష జాతాశౌచమును పట్టవలెను ప్రథమమున నుత్పన్నమయిన త్రిరాత్రమృతా శౌచకాలమున తరువాత ఉత్పన్నమయిన జాతాశౌచము సంభవించిన మృతాశౌచమును శుద్ధి చేసికొని శేషజాతాశౌచమును పట్టవలెను.

పక్షిణి పట్టవగినవారు · పినతల్లులు, పెదతల్లులు, మేనమామ భార్యలు. వీరి స్త్రీ పురుష సంతానము. మాతాపితమహులు, పెద తండ్రి, పిన తండ్రి. వీరి పురుష సంతానము. అన్నదమ్ములు, వారి స్త్రీ పురుష సంతానము. వివాహమయిన కుమార్తెలు, అల్లుండ్రు, కూతురు స్త్రీ పురుష సంతానము, సవతితల్లి సోదరులకు, సాపత్ని సోదర సోదరిలకును (కొందరి మతము) పురుషులకు అక్కా చెల్లెండ్ర భర్తలు, భార్య సోదరులు, అత్తమామలు.

పక్షిణి పట్టవగినవారు :- వివాహమయిన స్త్రీలకు పెదతండ్రి, పినతండ్రి భార్యలు, భర్త సోదరుని కుమార్తెలు, అక్కా చెల్లెండ్ర భర్తలు.

బ్రాహ్మణులకు 10 దినములు, క్షత్రియులకు 12 దినములు, వైశ్యులకు 15 దినములు, శూద్రులకు 30 దినములని ఆస్తి ధర్మశాస్త్రముల యందు అశౌచమని చెప్పబడియున్నది

